
శతకాలు
భక్తి,జ్ఞాన,నీతి
రంగ శతకము



సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరవిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016469



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

శ్రీసద్గురుభ్యోన్నమః.

శ్రీరంగనాథపరబ్రహ్మేంద్రాయనమోనమః

# శ్రీరంగశతకము.

ఇది

శ్రీబ్రాహ్మణపట్టుగ్రామనివాసులగు

శ్రీబ్రహ్మవిద్యాపరిపూర్ణ శ్రీమత్కుంజమూరు

శ్రీగోపాలాచార్య వర్య యతీంద్ర

చంద్రగురుశేఖర ప్రియశిష్యుడయిన

తిరుమండ్యం దిగవింటి

నారాయణదాసుచే విరచితంబై

అనంతపురం కాలేజి తెనుగుపండితులయిన

ప్రయాగ వేంకటరామశాస్త్రిగారిచే

సరిచూడబడి

తిరుపతి

గోల్డన్ పవర్ ప్రెస్

ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

ప్రథమముద్రణము.

 1934 దీనివెల 2 అణాలు.

# పీఠిక.

ఆర్యులారా!

నాప్రార్థన నొక్కింత నంగీకరింపవలయును. నేను పంచకావ్యంబుల బఠించలేదు. గణయతిప్రాస లక్షణములెరుగను. శాస్త్రీయగ్రంథముల జదువ లేదు. చిన్ననాటనుండియు భక్తశరణ్యుండగు శ్రీమదిందిరారమణుండయిన శ్రీప్రసన్న రంగనాథ స్వామియందలి విడువనిభక్తి విశేషము చేతను, సాధుజనానుగ్రహము చేతను, యాదేవదేవునిమీద భక్తిపూర్వకముగా, గీర్తనలను, పద్యములను, భగవత్ప్రేరణచే వ్రాయుచుందును. సుధీవరులగు వారు యీశతకమునందెట్టి దోషములున్నను భక్త వత్సలుండయిన శ్రీరంగదేవునినమ్మి వారిపై భారము నిడిన యీదాసుని బరిహసించక తప్పులసవరించి ప్రచురింపజేయు మహాత్ములకు వందనశతంబు లొనర్చువాడను.

మరియు నాచరిత్ర కొంతవివరించెదను. జన్మ స్థానము తిరుమండ్యంగ్రామం. వన్నియకులసంజని తులగు శ్రీమద్దిగవింటి చెంగారెడ్డి మునియాంబ లకు ద్వితీయపుత్రుండను. మదీయవిద్యాగురువు లనేకులు ముఖ్యులగువారిరువురు. అనురుణసరోవర నగరమను అప్పళాయగుంట గ్రామనివాసులయిన శ్రీమత్కనములూరు వేంకటసుబ్బయ్యగారు, వడ

వాలగ్రామనివాసులగు శ్రీమత్సర్వేపల్లె సుబ్రహ్మ ణ్యయ్యగారు, వీరిరువురి సంపూర్ణానుగ్రహముచే కొంతవరకు విద్యను బడసితిని. యిప్పటినానినా సముద్ర బ్రాహ్మణపట్టుగ్రామం శ్రీప్రసన్న రంగనాథ స్వామివారిసన్నిధి. అనేకజన్మములలో జేయబడిన సుకృత విశేషముచేతను శ్రీమద్భగవద్భాగవత అనుగ్రహముచేతను శ్రీరంగనిసన్నిధిని చేరగలిగి తిని మోక్షసాధనములగు భక్తిజ్ఞాన వైరాగ్యముల గలుగజేసి నన్ను సంపూర్ణ ప్రీతినేలిన కారణగురు వులు. శ్రీబ్రహ్మవిద్యా పరిపూర్ణులును, సచ్చిదా నందస్వరూపులును, పరమకారుణికులును, అగు శ్రీమత్కాంజనూరు గోపాలాచార్య వర్య యతీంద్ర చంద్రశేఖరులు. వీరి అపార కరుణాకటాక్ష వీక్ష ణామృతధారచే తడుపబడి నాయొక్క ఘోరభవ బృంద దావానలను చల్లారబడినది. వీరిఋణము దీర్ప నెన్నికల్పములయినను చాలదు. నన్నుద్ధరిం చిన మదీయసద్గురు మూర్తికిని, తలిదండ్రులకును విద్యాగురువులకును, అనేక శిరస్సాష్టాంగ దండ ప్రణామంబులు సర్వేశా భక్తవత్సలా మమ్మెల్ల రను నీదయయుంచి రక్షించుము.

ఇట్లు,
శ్రీమద్భగవద్భాగవత నిజ దాస దాసుడు.
తి. ది. నారాయణుడు.

శ్రీరామజయం.

శ్రీ శ్రీ పాలస్వామి సద్గురవేనమః

శ్రీప్రసన్న రంగనాథ పరబ్రహ్మణేనమః

# శ్రీరంగశతకము.

కం॥ శ్రీమన్నారాయణహరి
సామజపరిపాలవరద ♦ సజ్జనలోలా
నేమముతో నినుఁదలచెద
కామితములనొసఁగినన్నుఁ ♦ గావుమురంగా॥ 1

కం॥ ఓకారుణ్యాపయోనిధి
పాకారిగిరీశవినుత ♦ పావనచరితా
లోకాధారపరాత్పర
నాకాధారమ్ముగమ్ము ♦ నగధరరంగా॥ 2

కం॥ సారసలోచనమాధవ
నారదసనకాదివంద్య ♦ నందకుమారా
మేరుగిరిధీర శ్రీధర
గారవమునబ్రోవవయ్య ♦ కరినుతరంగా॥ 3

కం॥ మురహారకృష్ణజనార్దన
సరసిజభవవినుతచరణ ♦ సంకటహరణా
నరహరినను రక్షించవె
వరమునిపూజితముకుంద ♦ వరదారంగా॥ 4

కం॥ కమలపదకమలనాభా
కమలారిదినేంద్రనేత్ర ♦ కలుషవిదూరా
కమలనిధిశయనభవహర
సమయమిదేనన్నుఁగావ ♦ సద్గుణరంగా॥ 5

కం॥ దనుజగణవనకుఠారా
మునిమానససరసిజమిత్ర ♦ మురళీలోలా
వనజభవభవసురార్చిత
కనకాంబరధారినన్నుఁ ♦ గావవె రంగా 6

కం॥ సృష్టిస్థితిలయకారణ
శిష్టజనోద్ధరణమౌని ♦ సేవితచరణా
దుష్టవినాశనగిరిధర
కష్టములనుబాపవయ్య ♦ గజనుతరంగా॥ 7

కం॥ రక్షించుదొరవునీవని
పక్షీంద్రవిహారనిన్నుఁ ♦ బ్రార్థించితిగన్
రక్షించువరదపాండవ
పక్షాసరసీరుహాక్ష ♦ భవనుతరంగా 8

కం॥ దానవకులసంహారా
దీనజనోద్ధారవాసు ♦ దేవముకుందా
మానకనినుమనమునఁగను
పూనికతోదలతునన్నుఁ ♦ బ్రోవుమురంగా॥ 9

కం॥ భవనుతభవహరధీరా
నవవికచాంభోజనేత్ర ♦ నారదగాత్రా
నవరత్నమయవిభూషణ
శివకరదయజూడవయ్య ♦ శ్రీహరిరంగా॥ 10

కం॥ గతిలేనివారికెల్లను
గతినీవేయనుచువింటిఁ ♦ గాంచనచేలా
పతితుఁడనను పాలింపవె
యతిజనపోషణమురారి ♦ హరిశ్రీరంగా॥ 11

కం॥ సకలచరాచరనాయక
యకలంకచరిత్రసుంద ♦ రాననఝూంశా
శుకశౌనకమునివందిత
వికచాంబుజనయనగాన ♦ వేశ్రీరంగా॥ 12

కం॥ ఎన్నెన్నోవిధములనునిను
సన్నుతిసేసిననుబ్రోవ ♦ సమయముగాదా
పన్నగశయనరమేశా
వెన్నుడభవదూరవేద ♦ వేద్యారంగా॥ 13

కం॥ త్రిగుణాతీతనిరంజన
సుగుణాలయభక్తవరద ♦ సురుచిరభూషా
నగధరనేనీవాడను
తగునానిర్దయతఁజూప ♦ ధరధరరంగా॥ 14

కం॥ అండజవాహనసురరిపు
ఖండనపరిపాలసుజన ♦ కలుషదళనా
దండమ్ములుగైకొనిననుఁ
గుండలిపతిశయనయేలు ♦ కొనుమీరంగా॥ 15

కం॥ గోపాలభక్తవరదా
పాపాభ్రసమీరధీర ♦ పరమదయాళో
నాపాలిదైవమనిమది
శ్రీపతినినువేడుకొందుఁ ♦ జిన్మయరంగా॥ 16

కం॥ కరిమకరిచేతజిక్కియు
పరిపరివిధములనునిన్ను ♦ ప్రార్థించినయా
కరివైరిఁద్రుంచిదయతో
కరిఁగాచితిపరమపురుష ♦ కావవెరంగా॥ 17

కం॥ క్రూరుఁడు దుర్యోధనుఁడా
నారీమణిద్రుపదుపుత్రి ♦ నవమానింపన్
చీరలొసంగియుబ్రోచిన
వారిదనిభగాత్రభక్త ♦ వత్సలరంగా॥ 18

కం॥ ఎందరినోగాచినావఁట
సుందరవదనారవింద ♦ శుభకరహరినా
యందుదయరాదదెందుకొ
మందరధరమదనజనక ♦ మాధవరంగా 19

కం॥ రారానను బ్రోవనుసుకు
మారారణశూరభక్త ♦ మందారనిరా
ధారా శ్రీదామోదర
ఘోరాఘవిదూరధీర ♦ కోమలరంగా॥ 20

కం॥ సర్వవ్యాపకుడంచును
సర్వేశ్వరుఁడనుచుసర్వ ♦ సముఁడవనుచునిన్
బర్వేందువదననమ్మితి
సర్వజ్ఞుఁడమనుపవయ్య ♦ సదయారంగా॥ 21

కం॥ నినుమించినదైవంబును
నమమించినదీనుడవని ♦ నరయగ లేఁడో
మునిజనమానసనిలయా
కనకాద్రిసమానధీర ♦ కవినుతరంగా॥ 22

కం॥ నారాయణనారాయణ
నారాయణయనుచుఁబ్రీతి ♦ నందనుఁజీరన్
గ్రూసినజామిళునిదయ
నారసిరక్షించితౌర ♦ నరహరిరంగా॥ 23

కం॥ హరిరామకృష్ణయనుచును
నిరతముజపియించువారి ♦ నిఖిలాఘములన్
హరియింతువనుచువినినే
గురుతుగసనుదలతుఁబ్రోవు ♦ గురువరరంగా 24

కం॥ బంగరుచీరధరించిన
శృంగారశరీరభక్త ♦ సులభరమేశా
గంగాధరవందితపద
సంగరహితబ్రోవనిదియె ♦ సమయమురంగా 25

కం॥ వనరుహసంభవుఁడైనను
వనజారిధరుండునైన ♦ వాసవుఁడైనన్
గననేరనినీమహిమలఁ
గొనియాడఁగనెంతవాఁడ ♦ గుణనిధిరంగా॥ 26

కం॥ సూరిజన వనధిసోమా
తారకనామాభిరామ ♦ దైవలలామా
యేరీతినన్నుఁబ్రోతువొ
భూరిగుణస్తోమధామ ♦ బుధనుతరంగా॥ 27

కం॥ సంసారాంబుధిఁద్రోయక
కంసాసురహరణనన్నుఁ ♦ గడతేర్పుమయా
హంసవిహారార్చితయిన
వంశాంబుధిసోమబుధని ♦ వాసకరంగా॥ 28

కం॥ నిన్నుభజించినవారికి
సున్నగదాయమునిబాధ ♦ సుందరరూపా
యెన్నడునీదయగల్గునొ
పన్నగరాడ్తల్పపరమ ♦ పావనరంగా॥ 29

కం॥ సతతమునినుఁగడుభక్తిని
బతిమాలినగానినన్నుఁ ♦ బాలింపనుస
మ్మతిలేదదేవవేరే
గతియెరుఁగనుసకలలోక ♦ కారణరంగా॥ 30

కం॥ కేశవపశుపతిసేవిత
నాశరహితవిశ్వరూప ♦ నతజనలోలా
యీశామునిజీవనపర
మేశాననువేరుసేయ ♦ నేలారంగా॥ 31

కం॥ కలిబృందతిమిరభాస్కర
నలినాక్షఖగేంద్రగమన ♦ నగరాడ్ధీరా
బలవీరదైత్యమదహర
చలమేలరజలజనాభ ♦ సదయారంగా॥ 32

కం॥ ఖండితసురరిపుబృందా
పండితజనగేయపతిత ♦ పావననామా
భండనభీమావరవే
దండావనవరదనన్ను ♦ దయగనురంగా॥ 33

కం॥ ముచుకుందవరదనగధర
సచరాచరహృదయభక్త ♦ సన్నుతచరణా
యచలాత్మకననుఁబ్రోవర
యచలాత్మజనాధవినుత ♦ హరిశ్రీరంగా॥ 34

కం॥ ఏరీతినన్నుఁ బ్రోతువొ
గౌరీపతివినుతపాప ♦ ఖండనదేవా
కారణభువనచతుర్దశ
హారానవర్ణితభూష ♦ యచ్యుతరంగా॥ 35

కం॥ మారశతకోటిరూపా
తారేశదినేశనయన ♦ తారకనామా
నీరధిగభీరగరుడవి
హారాకైవల్యమీర ♦ హరనుతరంగా॥ 36

కం॥ మందారభక్తజనగణ
బృందారకవంద్యదీన ♦ పోషణహరిగో
విందాయుభయము మొసంగుము
వందితచరణారవింద ♦ వరదారంగా॥ 37

కం॥ సుందరముఖుపదపద్మని
నిందీవరనయనువిష్ణు ♦ నీశురమేశుఁ
బంధవిమోచనునినునా
నందంబునదలఁతుఁగొల్తు ♦ నతభవరంగా॥ 38

కం॥ గిరిధరకరివరపాలా
పరిజనసంతోషకౌస్తు ♦ భాలంకారా
సిరినెదనిడుకొనుదేవా
హరినాచెయివదలకయ్య ♦ యతినుతరంగా 39

కం॥ జైవాతృకమానసముని
సేవితపదయుగళసుజన ♦ జీవనభరణా
తావకమృదుపదభక్తియు
సేవయుదయసేయవయ్య ♦ శ్రీకరరంగా॥ 40

కం॥ తాపత్రయముల బాపియుఁ
గాపాడుముకుజనదూర ♦ కామితఫలదా
శ్రీపతినిర్జరవందిత
ధ్యాపద్బాంధవచరాచ ♦ రాత్మకరంగా॥ 41

కం॥ నీకేమిభారమానసుఁ
జేకొనిరక్షించుటకును ♦ శ్రీరమణీశా
రాకాసుధాకరానన
నాకాధిపవినుతలోక ♦ నాయకరంగా॥ 42

కం॥ ఆలింపుమునామనవిని
పాలింపుమునన్నువికచ ♦ పద్మదళాక్షా
దూలింపుమఘచయమ్మును
శీలాశ్రీలక్ష్మిలోల ♦ చిన్మయరంగా॥ 43

కం॥ శరణుభవాంబుధితరణా
శరణుఖగేంద్రారిశయన ♦ శ్రాంతవహరణా
శరణునీరీహనిరంజన
శరణమ్మురానకముకుంద ♦ శరణమురంగా 44

కం॥ దండముధరణీనాయక
దండమురవికోటితేజ । దండమున్నృహరీ
దండముపీతాంబరధర
దండముగైకొనుముమోక్ష । దాయకరంగా 45

కం॥ దరిదాపునీవ్రయనుచును
నిరతముమదినమ్మినాఁడ । నిర్మలచరితా
స్మరకోటిరూపదయతోఁ
బరిమార్పుమునాదుభవము । భయహరరంగా 46

కం॥ సుజనమయూరపయోధర
భుజగశయనభద్రచరణ । భూమీశహరీ
విజితమదాసురశ్రీధర
భజియించెదనాదునఘము । బాపుమురంగా 47

కం॥ శ్రీనాథామధుసూదన
దీనజనత్రాణభాను । తేజసుధీరా
గానప్రియమంగళకర
మానకనిమదలఁతునన్నుఁ । మనుపుమురంగా 48

కం॥ బాలేందువదనత్రిజగ
త్పాలాభక్తానుకూల । భవనిర్మూలా
మూలాసకలచరాచర
నీలాంబుదదేహసుగతి । నీయవెరంగా॥ 49

కం॥ శరణాగతరక్షకుఁడని
బిరుదును వహియించినన్ను శ్రీప్రీతిని బ్రోవన్
కరుణయొకింతయు లేదా
మురదానవహరణపాప మోచనరంగా॥ 50

కం॥ ధరనేజన్మముగలిగిన
పరిపరివిధములనుదుఃఖ పాత్రుఁడనైనన్
మరవకనినుస్మరియించెడి
గురుతరభాగ్యంబునీవె కోవిదరంగా॥ 51

కం॥ జన్మములెన్నిగతించెనొ
జన్మములికనెన్నిగలవొ జలనిధిశయనా
జన్మవినాశననను దయ
జన్మరహితుఁజేయు మయ్య సద్గుణరంగా॥ 52

కం॥ ఏవిధముననను బ్రోతువొ
సేవితపురవైరిసుజన జీవనశౌరీ
భావజజనకమురారీ
నీవేగతికుధరధారి నిర్మలరంగా॥ 53

కం॥ చంచలమగునామనసును
పంచబాణజనకనీదు పదయుగ్మముపై
నుంచవెననుపాలించవె
యంచితమౌనీంద్రవినుత హరిశ్రీరంగా॥ 54

క॥ హరిమృగములబోరిగొనుక్రియ
హరియింపుమునాదునఘము – హరికరివరదా
హరిహయవందితపదయుగ
హరిశశధరనయనసుందరాననరంగా॥ 55

క॥ నీదయగల్గిననాకే
బాధయులేదయ్యవికచ – పంకజనయనా
సాధుహృదాంబుజదినకర
భూధవసురవినుతభక్త – పూజితరంగా॥ 56

క॥ విశ్వాతీతపరాత్పర
విశ్వేశ్వరవిశ్వరూప – విశ్వాధారా
విశ్వమయవిశ్వరక్షణ
విశ్వంభరనన్నుఁబ్రోవ – వేశ్రీరంగా॥ 57

క॥ కష్టములెగల్గఁజేతువొ
కష్టములనుబాపినన్ను – కడతేర్తువొనీ
యిష్టముఎటుసేసినసరె
శిష్టజనాధారమాని – సేవితరంగా॥ 58

క॥ అపరాధసహస్రములను
కృపతోమన్నింపవయ్య – గీర్వాణనుతా
తపనసమశుభశరీరా
కపటాసురమదవిభంగ – కలిహరరంగా॥ 59

కం॥ మీనంబై సోమకుఁడను
దానవుఁబరిమార్చియలవి  ధాతకుశ్రుతులం
దీనావనయొసగితివట
మానకననుగావవయ్య  మాధవరంగా॥ 60

కం॥ కమఠంబైగిరిదాల్చియు
నమరులకమృతంబునొసఁగి  నట్టిఘనుఁడవో
కమలాలయమణిభూషణ
కమలదళాయతసునేత్ర  గావవెరంగా॥ 61

కం॥ కిటియైకనకాక్షుండను
కుటిలాసురుఁజంపిసురలు  కొనియాడంగా
పటుతరముగధరనిల్పిన
వటపత్రశయానబ్రోవ  వయ్యారంగా॥ 62

కం॥ సురరిపుహిరణ్యకశిపుని
బరిమార్చియుభక్తుఁడైన  ప్రహ్లాదునిస
ద్వరముల నొసంగికాచిన
నరహరినాదిక్కునీవె  నగధరరంగా॥ 63

కం॥ ఇలమూడడుగులుగైకొని
బలిదైత్యునిబలిమినడచి  పాకారికిభూ
తలమొసగినవామననా
కలుషములనుబాపులోక  కారణరంగా॥ 64

కం॥ ధరనిరువదియొకమారులు
వరఘనపరశువుధరించి ఽ వసుధాధిపులన్
నురుమాడినమధుసూదన
పురహరనుతననుబిరాన ఽ బ్రోవుమురంగా 65

కం॥ దశరథవరతనయుండవై
దశముఖునుమాడినట్టి ఽ ధరణీజేంద్రా
శశినిభవదనమురాంతక
పసివాండనుప్రాపునీవె ఽ భవహరరంగా॥ 66

కం॥ బలరామకృష్ణరూపుల
ఖలులైన ప్రలంబకంస ఽ ఘనదానవులన్
బొలియించినపురుషోత్తమ
కలినాశనవేగనన్నుం ఽ గావుమురంగా॥ 67

కం॥ ధరపాషండులద్రుంచను
వరబుద్ధుండవైనవరద ఽ వసుధానాథా
గిరిధరపరిజనపోషణ
త్వరగాననుగావరావె ఽ దైవమరంగా॥ 68

కం॥ కలికల్మషనాశనహరి
దొలగింపుమునాదుభవము ఽ తోయజనేత్రా
కలికావతారమెత్తగ
దలచితిధర్మంబునిలుప ఽ ధరపతిరంగా॥ 69

కం॥ పలలాశనకులనాశన
జలరుహదళనేత్రభద్ర ♦ చారిత్రహారీ
జలజారివదనమాధవ
జలజాసనవినుతశరణు ♦ జయశ్రీరంగా॥ 70

కం॥ వనమాలి కైటభారీ
వననిధిశయనాసురేంద్ర ♦ వందితశౌరీ
నినునమ్మితిగిరిధారీ
ననుమఱచుటన్యాయమా న ♦ నరహరిరంగా 71

కం॥ నీమాయవలనుజిక్కియు
పామరుడై చెడితినన్ను ♦ పాలింపవెమో
కోమలగాత్రనిరంజన
తామరసదళాయతాక్ష ♦ దండమురంగా॥ 72

కం॥ నమ్మితిపంకజనాభా
నమ్మితిపూర్ణేందువదన ♦ నందకుమారా
నమ్మితిరక్షకుఁడనివా
నమ్మిక యెటులౌనొభక్త ♦ నాదనరంగా॥ 73

కం॥ భక్తిజ్ఞానవిరాగము
భక్తావనయొసగవయ్య ♦ పరమపవిత్రా
ముక్తిదమునిజననిలయా
నక్తంచరహారణపాప ♦ నాశనరంగా॥ 74

కం॥ శరణనివేడినశత్రులు
కరుణించిననీకునన్నుఁ ♦ గావఁగబరువా
పరువేమైననుచెడునా
సరివారలదక్కువౌన ♦ సదయుడరంగా॥ 75

కం॥ దుర్గుణములదొలగింపవె
నిర్గుణనిత్యస్వరూప ♦ నిర్మలతేజా
భర్గనుతభద్రనిలయా
స్వర్గేశార్చితముకుంద ♦ జయహరిరంగా॥ 76

కం॥ జేజేజగదభిరామా
జేజేవరసుగుణధామ ♦ జేరణభీమా
జేజేతారకనామా
జేజేమాంపాహిదేవ ♦ జేజేరంగా॥ 77

కం॥ దరిదాపునీవెయనినీ
దరిజేరితినన్నువిడువ ♦ దగునావరదా
హరినారాయణమాధవ
గురువులగురువైనయాది ♦ గురువరరంగా॥ 78

కం॥ రావాననుదరిజేర్చవ
దేవాదేవాదిదేవ దీనదయాళో
భావాతీతజనార్దన
భూవల్లభకృష్ణసుజన ♦ పోషకరంగా॥ 79

కం॥ నీకృపగల్గినయప్పుడె
లోకములన్నియును చేతి ♦ లోనివిగదయో
పాకారివినుత కేశవ
నీకరుణనుజూపవయ్య ♦ నిరుపమరంగా॥ 80

కం॥ నినుభజియించుటకంటెను
ఘనపదవులుగలవెయరయ ♦ కాంచనచేలా
నినుభజియించెదదలచెద
ననునిర్దయజూడకయ్య ♦ నరహరిరంగా॥ 81

కం॥ హీనులచేతననన్నవ
మానముగావింపనీకు ♦ మర్యాదగునా
దీనావనాఖ్యయెందుకు
నానాఘభుజంగగరుడ ♦ నగధరరంగా॥ 82

కం॥ ఘనుడైననీచుడైనను
నినుదలచకముక్తినంద ♦ నేరడుదేవా
దనుజకులాంతకశుభకర
వనజారిసహస్రవదన ♦ వరదారంగా॥ 83

కం॥ నినుగీర్తించెదమన్నను
నినుధ్యానించెదమటన్న ♦ నిమిషంబైనన్
మనసొకచోటనునిలువదు
మునినుతనేనేమిసేతు ♦ మురహరరంగా॥ 84

కం॥ భద్రముజలధరదేహా
భద్రముసౌందర్యరూప ♦ పరమపవిత్రా
భద్రమురిపుహరనీకును
భద్రముభద్రేభవరద ♦ భద్రమురంగా॥ 85

కం॥ సేవితబృందావననిను
సేవించెడిభక్తకోటి ♦ సేవకుడగుచున్
జీవనముగడపుభాగ్యము
దేవారివినాశయొసగు ♦ దేవారంగా॥ 86

కం॥ కులహీనుడగుణహీనుడ
కలుషాత్ముడనన్నునెటుల ♦ కడతేర్చెదవో
జలజాక్షునిన్నెనమ్మితి
జలజాప్తశతప్రకాశ ♦ జయజయరంగా॥ 87

కం॥ పురుషోత్తమగోవిందా
పురుహూతనుతాబ్జపాద ♦ భోగిశయనశ్రీ
నరసింహవాసుదేవా
కరివరదాగావవయ్య ♦ ఘనగుణరంగా॥ 88

కం॥ ధ్రువునకుధ్రువపదమిచ్చిన
ధ్రువరూపయనంతవిగత ♦ దోషరమేశా
నవవికచకమలలోచన
తవపదభక్తీవెయిష్ట ♦ దాయకరంగా॥ 89

క॥ కందర్పజనకనీవీ
కందునిదయజూడవేమి కారణమో నా
యందేమినేరమున్నను
మందరధరమాన్పిగావు ♦ మయ్యారంగా॥ 90

క॥ పిడికెండటుకులనిచ్చిన
కడుముదమున నారగించి ♦ ఘనసంపదలన్
వడిగఁగుచేలునికిచ్చితి
తడవేటికినన్నుబ్రోవ ♦ దయగనురంగా॥ 91

క॥ ఎంగిలిపండులనిచ్చిన
మంగళమనిశబరిఁబ్రీతి ♦ మనిచినరామా
బంగరుకొండవుగదవాక
వెంగలినింగరుణఁజూడ ♦ వేరారంగా॥ 92

క॥ క్షీరాబ్ధిశయనలోకా
ధారానవరత్నహార ♦ దానవదూరా
మారారివినుతశ్రీధర
రారానన్నుబ్రోవవేగ ♦ రాఘవరంగా॥ 93

క॥ ననుమఱచిననినుమఱవను
ననువిడచిననిన్నువిడను ♦ నతసురబృందా
ననుదలఁపకున్నభక్తిని
నినుదలఁచెదసేవజేతు ♦ నిక్కమురంగా॥ 94

కం॥ తల్లియుఁదండ్రియునీవే
నల్లనిదొరగురుడునీవె ♦ నాథుడునీవే
ఫుల్లాబ్జనయన దైవం
బెల్లనునీవనుచుమదిని ♦ నెంచితిరంగా॥ 95

కం॥ కరిద్రాపతిబిలువఁగనే
పరుగుననేతెంచివారి ♦ పాలించినయా
కరుణయిపుడెందుదాగెను
త్వరననుదయజూడుశత్రు ♦ తాపవరంగా॥ 96

కం॥ దేహేంద్రియప్రాణములను
శ్రీహరినీకర్పణంబు ♦ చేసితినయ్యా
పాహిముకుందమురారీ
మోహరహితభక్తబంధ ♦ మోక్షదరంగా॥ 97

కం॥ నీమూర్తియందెచూపులు
నీముక్తిదకథలచెవులు ♦ నీపైఁదలఁపుల్
నీమ్రోలమ్రొక్కుశిరమును
నీమంగళకృతులుగేల ♦ నీయవెరంగా॥ 98

కం॥ కోరితికడతేర్చెదవని
కోరితినినుమదినిభక్తి ♦ కోమలగాత్రా
కోరనునిన్నువినానా
కోరికయేమానొవినుత ♦ కుంజీరరంగా॥ 99

కం॥ అడిగితినాథునపదవుల
యడిగితినాభోగభాగ్య ♦ మైశ్వర్యమ్ముల్
అడిగితినాయేమైనను
ఆడిగితినీపాదసేవ ♦ యద్వయరంగా॥ 100

కం॥ పలికించినట్లుపలికితి
పలుకనునాయిష్టముగను ♦ పంకజనాభా
పలుకులలాభమునీదే
పలుకులలోభంబునీదె ♦ భవహరరంగా॥ 101

కం॥ నాకవితజదివిచూచియు
లోకులుహాస్యంబుసేయు ♦ లోకారాధ్యా
నీకీర్తియె చెడుకొంతయు
నాకేమియులేదుపాప ♦ నాశనరంగా॥ 102

కం॥ రవిశశియునుండువరకును
భువినాకవితయునునిల్పి ♦ పోషింపుమయా
రవికోటితేజశ్రీధర
నవపద్మదళాక్షదేవ ♦ నరహరిరంగా॥ 103

కం॥ ధరబ్రాహ్మణపురివాసా
సురుచిరనవరత్నభూష ♦ సుందరవేషా
వరమునిజనసంతోషా
కరుణింపుముమృదుసుభాష ♦ కలిహరరంగా 104

కం॥ మంగళముపరమపురుషా
మంగళముభవాబ్ధితరణ ♦ మంగళముహరీ
మంగళముభక్తనిలయా
మంగళమిదెనీకువరద ♦ మాధవరంగా॥ 105

కం॥ లాలిజనార్దనకృష్ణా
లాలియనంతాదిదేవ ♦ లాలిముకుందా
లాలినిరంజననిర్గుణ
లాలిహరీభక్తవత్స ♦ లాశ్రీరంగా॥ 106

కం॥ జోజోలోకశరణ్యా
జోజోశతపత్రనయన ♦ జోజోనృహరీ
జోజోనిలింపరక్షణ
జోజోననుగావునీకు ♦ జోజోరంగా॥ 107

కం॥ హెచ్చరికనీకుశివకర
హెచ్చరికయనంతరూప ♦ హిమకరవదనా
హెచ్చరికముక్తిదాయక
హెచ్చరికగుగాకనీకు ♦ యీశారంగా॥ 108

కం॥ మేల్కొనుముమ్రొక్కెదనునిను
మేల్కొనుమునినుఁభజింతు ♦ మేల్కొనుదేవా
మేల్కొనుముసేవచేసెద
మేల్కొనుముహరాదివినుత ♦ మేల్కొనురంగా 109

కం॥ గోపాలగురునిశిష్యుఁడ
నాపేరెఱిగింతుసయ్య ♦ నారాయణుఁడన్
నీపయి జెప్పితిశతకము
శ్రీపతి గైకొమ్ము దేవ ♦ శ్రీహరిరంగా॥ 110

కం॥ ఈరంగశతకమెవ్వరు
కోరిపఠించినను విన్న ♦ కోరినవరముల్
నారాయణయిమ్మనినిను
కోరిభజించితినిశరణు ♦ గురువరరంగా॥ 111

ఓంతత్సత్

శ్రీరంగనాథపరబ్రహ్మార్పణమస్తు

శ్రీమద్దిగవింటి నారాయణదాస

విరచిత

శ్రీ రం గ శ త క ము.

సం పూ ర్ణ ము.

శ్రీ